# DEEPIKA

(A Collection or Freeverse Poetry)

BHANDARU VIJAYA



First Edition :

1984 August



Rs. 6

Publication No: 2

Cover Title :
Sri G. Prabhakara Swamy

For Copies :

1) B. Vijaya
University Library
Kakatiya University
Vidyaranayapuri, Warangal-506009

2) Srilekha Publications
5-11-114/4, Vidyaranypuri,
WARANGAL - 506009

3) Andhra Pradesh Book Distributors
R.P. Road, Secunderabad-500003.

---

NATARAJ PRINTERS,
WARANGAL.

# ప్రకాశకీయం

మా సాహితీ సమితి, వరంగల్లు పక్షాన ఈ రెండవ కవితా సంకలనం మా సంయుక్త కార్యదర్శి కుమారి భండారు విజయ గారి కవితలను "దీపిక" పేరుతో కవితా సంపుటిగా ప్రచురించుతున్నందుకు మాకు ఎంతో సంతోష దాయకమైనదే కాక, గర్వకారణ మైనదికూడా.

కుమారి విజయగారు ఉద్యోగరీత్యా తమ బాధ్యతలు నిర్వహించుకుంటూనే సాహితీ సంస్థలలో భాగస్వామి అయి తనకు తోచిన విధముగా సహాయాన్ని అందిస్తూ సాహిత్య కార్యక్రమాలకు ఊపిరి పోస్తున్నారు. అంతే కాకుండా వీరితో సునిశిత విమర్శ, దృక్పథం కూడా ఉంది.

ఆధునిక ప్రక్రియ అయిన "వచనకవిత"ను పండిస్తూ వ్యంగ్యం, హాస్యం మిళితంచేసి "సెటైర్" గాచెప్పగల వీరికలం నుండి జాలువారిన కవితలే ఈ "దీపిక" కవితా సంపుటి. ఇందులోని కొన్ని కవితలను మా మిత్రుడు డా॥ యమ మహేశ్‌గారు చిత్రాలు వేసి వాటికి ప్రాచుర్యము కల్పించారు. ఇందు లోని కవితలన్నీ సుగంధ మధురంగా జాలువారినవి. ఇందులో వైవిధ్యంగల కవితలు ఉన్నాయి. ఈకవితల్లో సామాజికత ఉంది, చైతన్యం ఉంది, స్పష్టత ఉంది. మీముందున్న ఈ సంపుటికి మేం ఏంచెప్పినా అతిశయోక్తి అవుతుంది. మీ అభిప్రాయాలకు ఎల్లవేళలా స్వాగతం.

ఈ సంపుటిని సాహితీ సమితి పక్షాన వెలువరించుకోవడానికి అనుమతి ఇచ్చిన భండారు విజయ గార్కి కృతజ్ఞతాంజలులు

మా సంస్థను సదా తమ భుజస్కంధాలపై మోస్తున్న శ్రీయుతులు కె.యస్.ఆర్.జి. ప్రసాద్, సి.హెచ్ రాములు, దాసరి కృష్ణారెడ్డి, శీలం రాజేశం, నిధి మనోహరాచారి, శ్రీనివాసరావు మరియు శైలజ, ఛాయ శ్రీరంగ స్వామి మరియు పరోక్షంగా సహకారాన్నందిస్తున్న మరెందరో మిత్రులకు అభినందనలు, కృతజ్ఞతలు.

మీ అభిప్రాయాలకు సదా స్వాగతం పలుకుతూ ఈ కవితాసంపుటి మీ ముందుంచుతున్నాము.

-నమలికొండ బాలకిషన్‌రావు
అధ్యక్షులు
సాహితీ సమితి, వరంగల్లు.

అగస్టు 1984
వరంగల్లు

# మనసులోని.... .... ....

నేను కవితా ప్రక్రియకు నాంది పలికి దాదాపు దశాబ్దం కావస్తోంది. ఇంతవరకూ కవితలు అల్లటం నా ఆత్మతృప్తివరకే అనుకున్నప్పటికిని మిత్రుల ప్రోత్సాహంతో అప్పుడప్పుడు కవిసమ్మేళనాలలో పాల్గొని పదుగురికి వినిపించడం జరిగింది.

ఈ నా కవితా ప్రక్రియలో ఇప్పటివరకు సాంఘిక, సామాజిక విషయాలకే పరిమితం ఇవ్వటం జరిగింది, అయినా, అవి ఎంతవరకు ప్రస్ఫుటించాయో! సహృదయులైన మీరే గ్రహించి మీ అమూల్య అభిప్రాయలను అందిస్తారని ఆశిస్తున్నాను.

సమాజచైతన్యానికి కవితా ప్రక్రియ ఒక సాధనం అనే నమ్మకంతో ఈ "దీపిక" ను మీ ముందుంచుతున్నాను.... ....మీసలహాలకు సర్వదా.... .... స్వాగతం! .... ....

ఇందులోని కవితలను ప్రచురించిన పత్రికాధిపతులకు, మరియు "దీపిక" లోని కొన్ని దివ్వెలను కవితా చిత్రాలుగా గీసి వాటికి ప్రాచుర్యతను కలిగించిన సోదరుడు డా॥. యస్. మహేష్ గారికి నా కృతజ్ఞతాంజలులు.

నా రచనాభిలాషను గుర్తించి, నేను వ్రాసిన ప్రతి కవితను విని నాకెంతగానో ప్రోత్సాహాన్నిచ్చిన మానాన్నగారు కీ.శే. శ్రీ భండారు ప్రసాదరావు మరియు నా ప్రియతమ సోదరుడు "మోహన్" అన్నయ్యలకు నా శ్రద్ధాంజలులు.

అనుక్షణం నాభుజం తట్టుతూ, నన్ను ప్రోత్సహిస్తున్న మా అమ్మకు నా సోదరులకు మరియు శ్రీ భండారు బ్రహ్మానందరావు అన్నయ్యలకు సర్వదా కృతజ్ఞురాలిని.

నా సాహితీపథంలో నాకు అండగా నిలిచిన మా "సాహితీ సమితి" సభ్యులందరికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

నా ఈ సంకలనానికి మెరుగులు దిద్దిన మిత్రులు, ఆప్తులు, శ్రీ. యం. బ్రహ్మాచారి [నిధి] గారిని మరియు శ్రీ టి. శ్రీరంగస్వామి గారినికూడా గుర్తు చేసుకోక పోవటం "కృతఘ్నతే" అవుతుంది.

ఈ సంకలనానికి కావలసిన కవరుపేజీని అందించి, తోడ్పడిన శ్రీ దామోదరరావు (ఆంధ్రా ప్రింటింగ్ ప్రెస్) మామగారికి నా కృతజ్ఞతలు

ఈ 'దీపిక' ను "సాహితీ సమితి" ద్వారా ప్రచురించు కోవటానికి అనుమతి ఇచ్చి ప్రోత్సహించిన సహృదయుడు నిష్కల్మషుడు అయిన సోదరుడు శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు గార్కి నా హృదయపూర్వక వందనములు.

నా ఈ 'దీపిక' కు అర్థవంతంగా "ముఖచిత్రాన్ని" అందించి మరింత దీప్తివంతం చేసిన శ్రీ జి. ప్రభాకరస్వామి (ప్రస్వాజి) గారికి నా కృతజ్ఞతాంజలులు.

ప్రత్యక్షంగా, పరోక్షంగా నా సాహితీ సేవలో సహకరిస్తున్న అందరికి నా నమస్సులు. ఈ సంపుటిని త్వరగా తప్పులు లేకుండా ముద్రించి ఇచ్చిన శ్రీ సాంబశివరావు మరియు నటరాజ్ ప్రింటర్స్, వరంగల్లు వారికి కృతజ్ఞతలు.

- భండారు విజయ



పేరు : భండారు విజయ

తల్లి : వరలక్ష్మి

తండ్రి : ప్రసాదరావు

జన్మస్థలం : జాలేమర్తి తా॥ సత్తెనపల్లి, జి॥ గుంటూరు.

ప్రస్తుత స్థిరనివాసం : వరంగల్లు

విద్యాభ్యాసం : ప్రాథమిక విద్య—జాలేమర్తి, నర్సరావుపేట
మాధ్యమిక విద్య నుండి వరంగల్లు

చిరునామా : కేంద్ర గ్రంథాలయం, కాకతీయ విశ్వవిద్యాలయం,
విద్యారణ్యపురి, వరంగల్లు—9

సాహితీ సంస్థలతో అనుబంధం:-

1) సాహితీ సమితి, వరంగల్లు, సంయుక్త కార్యదర్శి
2) శ్రీలేఖ సాహితి, వరంగల్లు, ఉపాధ్యక్షులు
3) సారస్వత మిత్రమండలి, వరంగల్లు కార్యవర్గ సభ్యులు
4) సాంస్కృతీ సమాఖ్య, వరంగల్లు.
రి. నెం. 927/83, సంయుక్త కార్యదర్శి



ఈ "దీపిక"—

అమ్మ, నాన్నలకు . . .

# ఆశ్చర్యం!

కూలివాడు చూసేది,
నీ! అంతస్తు వైపు కాదు!
ఆ! కళ్ళు వెతికేది
నీ! ఇనుప పెట్టె కాదు....
అబ్బా!....నాలో....
ఇంతటి నైపుణ్యం....ఉందా....!
ఇది నేను! ఇటుక పేర్చిన
ఆనంద భవనమేనా
అన్న....
"ఆశ్చర్యంతో"

# సందేహం

ప్రకృతి మాత
నిశ్శబ్దంగా
నయనాలు మూసుకుంది
తన వయసు
ఉడిగి కాదు....
వికృతి
అస్తవ్యస్తంగా
కరాళ నృత్యంలో
తేలియాడుతుంటే
తాను....
చూసి తట్టుకోగలనా
అన్న....
"సందేహంతో"

విజయ

# కొరత-చరిత

ఏ! పేపరు చూసినా!
ఏమున్నది! న్యూసు....
అంతా! ఒకటే! ఫార్సు!
హత్యలు.... ఆత్మహత్యలు
దోపిడీలు.... మానభంగాలు
ఏమున్నది'.... స్త్రీ'కి స్వేచ్ఛ?
ఎక్కడున్నది....'స్త్రీ'కి భద్రత?
ఎవడొచ్చి ఏలినా!
ఏమెరిగె మగువకు
అత్తమామల పోరు....
కట్న కానుకల హోరు....
కన్నీటి గాథలాయే!
కాంతల బ్రతుకు....
ఏమున్నది? ...
ఈ దేశ 'చరిత'
అంతా....ఓ బురద 'గుంట'

# ఊసరవెల్లి

రోజుకొక్కః
పేరుమార్చి....
నిముషానికొకః
ప్లేటు మార్చి....
పచ్చినెత్తురు
తాగుతున్న....
రాజకీయ....
రక్కసికి ....
బలి అవుతున్న
అనాధలెందరోః....
ఈ పుణ్యావనిలో ....

# నిర్వేదన

కూలి డొక్క
ఎండిపోయె।
కండ కరిగి
స్వేధ మాయె।
డొక్క నిండే।
దారి లేదు।
కండ పెరిగే
తీరు రాదు ...
ఒంటి నిండా గాయాలు
కనులు కదిపితే....కన్నీరు....
ఇవి కనిపించే
విజాలు....
వినిపించలేని
భావాలు
విన్న, నేటి కెంత తేడా।
వింగి, నేల కున్నంత।
సమాజమనే గొంగళిలో....
సమాధి అయే। జీవులెన్నో....

# సందేశం

కట్నం పేరుతో
నల్లబజారును
సృష్టిస్తున్న
ఓ! తల్లిదండ్రుల్లారా!
మీకో! సందేశం!
మీ....వంశోద్ధారకుడు
మిమ్మల్ని ఉద్ధరిస్తాడని
కలలు కంటున్నారేమో?
అది ఉట్టిమాట....
ముడుపు చెల్లించి....
బజారులో విక్రయించిన
పశువుపై....
అధికారం
మీది కాదు....
ధర చెల్లించిన వారిదే....!

# సహజత్వం

ఆకాశం వంగి
భూదేవిని
స్పృశిస్తే....
'దిగంతం'
ఆకలి వంగి
అన్నపూర్ణను
కౌగిలిస్తే....
యుగాంతము

# సగటు మనిషి

అనుమానాల "పుట్ట"
అవకాశాల ''గుట్ట''
చపలత్వాల ''కట్ట''
ఛలోక్తుల ''రెట్ట''
నిలకడలేని ''తిష్ట''
ప్రమాదాల "పరాకాష్ఠ"

# నాగమ్యం అటువైపు?

వేకువ వెన్నెలలో
కలువ కన్నులు గప్పి
ఓరగా! క్రీగంటగా!
నను చూపి
గేలి చేస్తోంది "సమాజం"
కలువ కన్నులు విచ్చుటకై
కల దారులు ఇవ్వంటూ!
కదల మంటోంది "ఇజం"....
ఇజాలన్నీ కన్‌ఫ్యూజయైన
వేళ
ఏది నిజమైన ఇజమో!

# రొటీన్ లైఫ్

ప్రతి నెల
జీతంలో....కొంత
వెనకేయాలని
అనుకుంటారు....
కానీ....
లేని ఖర్చు వచ్చి పడి
ఉన్నవన్నీ ఊడ్చుకుపోతే
అప్పుడే....
కలిగిన అవసరానికై....
అప్పుచేస్తే....
కనీసం....
మరో....నెలలోనైనా
మిగిలేయాలన్న "కోరిక"
వాయిదా....
పడుతూనే వుంది ...

# తనకు మాలిన ధర్మము

అమ్మాయి
పెండ్లికి....
అనపడగద్దు
కట్నం....
అబ్బాయి
పెండ్లికి....
ముహూర్తానికే
అందించాలి....
''మొత్తం''

# విద్య

చదవటానికి
పుస్తకాలే
అవసరంలేదు....
నీవు చదవగల్గితే....
ప్రతివారి హృదయం....
ఓ పుస్తకం
అది
ఏ గ్రంథాలలో
దొరకనిది
ఏ గురువు
నేర్పలేనిది

# కాంక్ష

అందని
అనంతాలను
అందుకోవాలనీ ....
ఆకాశ వీధుల్లో
విహరించాలనీ ....
లేదోయ్!
ఇప్పుడే!
నా! చెలి కాలి
అందియనై
మ్రోగాలని,
నా! చెలి చెక్కిలిపై
నును సిగ్గును
నేనై! మెరవాలని....
ఉందోయ్!

# నాదేశము

నాడు!
నా! దేశము
వేదభూమి
నా! దేశము
రత్నగర్భ
నా! దేశము
పుణ్యావని
నా! దేశము
శాంతివని
నేడు!
పడికట్టు పదాలు
ఇవి
పవిత్ర భారతి
వదనంలో....
కనిపించే
భయంకర బాధల పల్లవి

# ఈ సమాజం

భయపడి
పారిపోతున్నంత
కాలం....
వెంటాడుతూనే....
ఉంటుంది.
ఎదురు తిరిగి చూడు....
దాసోహం....అంటూ
నీ కాళ్ళు
పట్టుకుంటుంది.

# దూరంగా

అవసరానికి
        కాళ్ళుపట్టి
ఆశల పందిరికి
        నిచ్చెనలేసి
హిమవత్ శిఖరాన్ని చేరి
వలుసుల్లా విసిగివేసే!
కొజ్జాలు....
ఉచ్చాల....నుండి....
దూరంగా ....
జీవనం
సాగించాలని వుందోయ్!

# ప్రేమ - ఆరాధన

పురుషుడు
ప్రేమను....
ప్రేమిస్తాడు....
కాని....
ఆరాధించలేదు
స్త్రీ....
ప్రేమను....
ప్రేమిస్తుంది
ప్రేమను.... పెంచుతూ....
ఆరాధిస్తుంది.

# త్యాగం

తాను
కాలిపోతూ
పలువురికి
వెలుగు నిస్తుంది
'క్రొవ్వొత్తి'
తన
శరీరాన్ని
పండు చేసుకొని
అందరికి
ఆనందం
ఇస్తుంది ... "వెలయాలు"
వీరిద్దరి గమ్యం
త్యాగం....?



విజయ

# కల్తీయుగం

ఇది
కలియుగం
కాదు....
కల్తీయుగం
ప్రపంచమే....
రంగుల వలయం
ఇందులో....జీవించే....
జాతిలో....
ప్రేమ 'కల్తీ'
స్నేహం 'కల్తీ'
మనసు 'కల్తీ'
మమత 'కల్తీ'
నవ్వు 'కల్తీ'
ఏడుపు 'కల్తీ'
చదువు 'కల్తీ'
జ్ఞానం 'కల్తీ'
అసలు....
ప్రతి మనిషే....'కల్తీ'
అందుకే....
ఆర్టిఫిషియల్ ....
"హార్ట్స్" పెట్టుకొని....
బ్రతుకుతుంటారంటాను

# గ్రుడ్డి కన్ను

పురుషుడు
భార్యను కోల్పోతే,
వారం తిరగకుండానే....
మరో భార్యకి తయారు....
పైగా, అతనిపై సమాజ సానుభూతి ...
స్త్రీ....
భర్తను కోల్పోతే,
మరో పురుషుడితో
మాట్లాడితే చాలు....
సమాజం కళ్ళెఱ్ఱ చేస్తుంది
ఎందుకంటే,
దానికున్న....
రెండు కండ్లల్లో....
ఓ కన్ను గ్రుడ్డిదటా....!

# ఎరుపు - తెలుపు

ఉదయించే
భానుడు 'ఎరుపు'
అస్తమించే
భాస్కరుడూ 'ఎరుపే'
మురిపించే
మందారం 'ఎరుపు'
ఆహ్వానించే
ఆ గులాబి 'ఎరుపే'
నా పేరూ 'ఎరుపే'
నా కలం పేరూ 'ఎరుపే'
విప్లవం 'ఎరుపే'
నా రక్తం కూడా 'ఎరుపే'
కాని....
నా హృదయం మాత్రం
తెల్లని తెలుపెందుకో!

# శిరచ్ఛేదన

ఆకాశం
నా నుదురు
ఆవేశం
నా నేస్తం
అనుభవం
నా రక్తం
ఆశయం
నా ప్రాణం
ఎగిసిపడే
గుండెలు
మూసిన
పిడికిళ్ళు
జారిన
సింధూరం
ఎత్తిన
ఎఱ్ఱబావుటా!
కావాలోయ్!
విప్లవ వాదికి,
దాన్ని మించినది
లేదోయ్!....
ఈ స్వార్థ సమాజ
"శిరచ్ఛేదనకి"

# గాంధేయ వాదం

గుండెల్లో
గ్రుచ్చుకున్న
మదన
బాణాల్లా
అబలల
ఆర్తనాదాలు
"దేశంలో"....
పైశాచిక
తాండవం
చేస్తుంటే....
గాంధేయ వాదాన్ని
అవలంభిస్తూ....
ఏమీ పట్టనట్టు
నోరు మూసుకొని
కూర్చున్న
ఓ! సమాజ వ్యవస్థా!
మర్యాదగా....
నీ నైజాన్ని మార్చుకో....
లేదంటే....

# విప్లవం

ఓ!
సమాజమా!
న్యాయం గొంతు నొక్కి,
ధర్మం కళ్ళు కప్పి,
విచ్చలవిడి అయిన
నీ అన్యాయం,
''నశించేదాక''
''విప్లవం''
కోట్ల బిందువులై
వెంటాడుతుందన్న
'నిజం'
ఇకనయినా! తెలుసుకో!